

శ్రీరస్తు.

శ్రీమద్గణాధిపతయే నమః.

# శ్రీమద్గణేశస్తవరత్నావళిః.



శ్లో॥ శ్రీమద్గణేశ భవదీయపదాబ్జయుగ్మం
చిత్తాంబుజే మను సదా వినిబధ్య భక్త్యా
సర్వాంతరాయహరణాయ కరోమి సేవాం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౧

శ్లో॥ దుర్గా మదీయజననీ జనకోపి భిక్షు
ర్భ్రాతా చ మే బహుముఖః ఖలు వామనోహం
ఇత్యుక్తితోపి నహియాతి పదాబ్జనమ్ర
స్సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౨

శ్లో॥ మూఢోపి తే చరణసేవనతత్పరస్స్యా
ద్విద్యావిశేషనిపుణో భవతీతి శ్రుత్వా

సంసేవయామి చరణం శరణం ప్రపద్య
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౩

శ్లో॥ కైలాసశైలశిఖరోన్నతకాననేషు
ఘీంకారభీతహరిపోతనిపాతహేతుం
చిత్రక్రియాపరివృతం హృది భావయే త్వాం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౪

శ్లో॥ విద్యావిశేషభరతుందిలతా ముషీషి
హా కష్ట మద్య వితరం త్వజనాయ విద్యాః
త్యక్త్వా సుగర్భగురుతా ముపగచ్ఛ శాంత్యం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౫

శ్లో॥ దీనావనం కురు కృపాకలితాంతరంగ
విద్యాంబరాభరణభూషితదివ్యదేహ
భవ్యాని మే వితర భాసురపాశహస్త
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౬

శ్లో॥ జానే న తే జపవిధిం జగతా మధీశ
జానామి నో చరణసేవనమప్యతీవ
నిర్హేతుకా మయి కృపా తవ జాయతాం భో
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౭

శ్లో॥ దానాదికర్త్యగణనా ఖలు సర్వలోకే
బహ్మశ్రితాళిపరిగీతనిజప్రభావం

సంసేవయామి సతతం సకలార్థదం త్వాం
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥ ౮

శ్లో॥ శ్రీవత్సవంశజనితం కృపయాప్పనాఖ్యం
విప్రం త్వదీయచరణాంబుజభృంగభూతం
సంరక్షయాశు సకలాన్సుకలా వితీర్య
సర్వేశపుత్ర కరివక్త్ర సదాపవిత్ర॥



శ్రీరస్తు.

# శ్రీమద్గణేశస్తవరత్నావళి.



సీ॥ శ్రీసర్వమంగళాచిత్తాబ్జభాస్కర
విన్నపం బాలింపు విఘ్ననాథ
నీదివ్యమంత్రముల్ నేర్పున జపియించి
యష్టావధానాదులందు శక్తి
యుక్తులై భక్తులు రక్తులై నినుగూర్చి
జేసినపద్యముల్ జెవులనిండ
విని వేడ్క లోగల్గి విధివత్ప్రకారంబు
నీమంత్రరాజంబు నేర్చలేక

గీ॥ బాగుగా నీదుపాదముల్ భావమందుఁ
దలచి నీపూజగావింతు దయను జూపి
సమయ మియ్యదె రక్షింప శర్వతనయ
కోర్కె లొసగూర్పు దయతోడ గుజ్జువేల్పు! ౧

సీ॥ వందారు నిజదాససందోహమందార
మందారమాలలీకుందహార

కైలాసభూధరకాననానంతరచార
చారణాద్యమరసంస్తవవిహార
ఖండనోర్జితవీరఖండనోజ్జ్వలశూర
ఖండితాఖిలవిఘ్నకలుషభార
సంగీతసాహిత్యసంస్తుత్యశృంగార
యంగజాహిత మనోహరకుమార।
గీ॥ శ్రవణసంజాతమారుతచలితతార
తారకాధీశపాండరతరశరీర
ధారుణీధరసంకాశ ధైర్యసార
కోర్కెలొసగూర్చు దయతోడ గుజ్జపోడ। ౭
సీ॥ లోకేశుఁడైనను నీకు మ్రొక్కకయున్న
సత్యలోకంబేల సాగఁగలఁడె
కేశవుండైన నిన్కీర్తింపకుండినఁ
బాలసుదిండులనెల్ల గెలువఁగలఁడె
శంకరుండైన నిన్శంకయు లేకున్నఁ
దలఁచక శూలంబుఁదాల్పఁగలఁడె
వాసవుండైన ని న్వర్ణింపకుండిన
కులిశంబు కెంగేలఁ గూర్పఁగలఁడె
గీ॥ యట్టిఘనులైన నినుఁ దల్చకలరకుంట
గనుచు నిన్నేడి దాసులు ఘనతగొంట

# శ్రీమద్గణేశస్తవరత్నావళి.

తెలిసి సేవింతు విద్యలుఁ గలుగుదంట
కోర్కెలొనగూర్చు దయతోడఁ గుజ్జపోఁడ॥

సీ॥ గుజ్జువై నీవు బలుబొజ్జయును గైకొన్నఁ
గొప్ప తేజీతోడఁ గూడియున్న
కరిరాజు శిరముచే కలితుండనై యున్న
దంతమొక్కటి నీవు దాల్చియున్న
కెంగేలశూలంబుఁ గీలించియున్నఁ డా
పలికేలఁ బాశంబుఁ బట్టియున్నఁ
భుజంగోపవీతంబు భుజభాగమందున్న
ఘనకర్ణచలనంబుఁ గలిగియున్న

గీ॥ భక్తులెల్లరు నినుఁగాంచి భయములేక
భక్తితోఁ గొల్చుటలుజూడ పనులుఁ జెరుప్ర
దండివనికాదె కుసుమములఁ దిండికాడ
కోర్కెలొనగూర్చు దయతోడ గుజ్జపోఁడ॥ ర

సీ॥ ఈశ్వరుండను పేర నైశ్వర్యదాతవై
నీతండ్రి విఖ్యాతి నెరపఁ జగతి
నంబి కాహ్వాయముచే నందరి నరయుచు
నీతల్లి ప్రఖ్యాతి నిలుప దిశల
నట్టివారలకు నీవాత్మజాతుండవై
కఠినమానసవృత్తిఁ గలిగి భక్త

సంరక్ష గావింప సమకట్టకుండినఁ
గసలి దాసులు నిన్ను గాంచి మేన
గీ॥ మామపోలిక పోదన్నమాటనిజము
జేసితివటంచు నిందలు చేయకుండ
దల్లిదండ్రులపోల్కెలఁ దాల్చి నీవు
కోర్కెలొసఁగూర్చు దయతోడఁ గుజ్జువోడ॥ ౫
క॥ శ్రీవత్ససగోత్రార్పిత
కావిదరచితాంధ్రపద్యకోమలరసనం
భావన సమ్మద మొందుము
పావన గణనాథ భక్తపాలనపరతా॥ ౬

సమాప్తము.



శ్రీరస్తు.

# గణేశస్తవరత్నావళి.



శ్రీ పాచిపేట కుమారరాజావారిచే రచియింపబడినవి.

క॥ శ్రీవరనుత కరిముఖ యీదె
గావింౘెద చంద్రకులుఁడ ఖండేందుధర
శ్రీ విశ్వనాథమల్లప
భూవరుఁడ కరీంద్రమాల ముదమునఁగొనుమా॥ ౧

సీ॥ తొగకన్నియకు వింత వగజూపి నగియింప
వెన్నెల లేని సర్వేషుతోడఁ
బులుఁగురావన్నెలఁ బలుమారు నగఁజాలి
రాణించు గరిక తురాయితోడ
దళుకొత్తు మెఱుపుమొత్తముల మించులమించు
దంబైన పసిఁడిపుట్టంబుతోడ
నరుదంద తెలిజక్కి మొరకపల్లములందుఁ
దిరుఁగనేర్చిన కొక్కు తేజితోడ

గీ॥ ముజ్జగఁబులుఁగల చిన్ని బొజ్జతోడ
ముద్దులొలికెడు యేనుఁగ మోముతోడ

వఱలు నినుఁగొల్తు మెపుడు సంబరముతోడ
శ్రితదురితదూర కొక్కుతేజీ వజీర॥ ౨

సీ॥ హరిహరాంబుజగర్భులైన నను నీవలె
తొలి మ్రొక్కులనుఁబొందఁగలరె చెప్పుమ
యాశేంద్రులైన నీవాగ్రహించిన కార్యములు
చక్కఁగా జేయగలరె చెప్పుమ
యఖిలామరాజేయులైన నిన్నాదరించి
కలనలోపల నిల్వఁగలరె చెప్పుమ
త్రిజగజ్జనములైన నిజముగా నీదగు
కార్యంబులకు నడ్డఁగలరె చెప్పుమ

గీ॥ అయ్య వెనకయ్యవారెల్ల సరిసిజాక్ష
నీకు వెనుకయ్యవారలే నిక్కమనుచు
గట్టిగ వచింతు మొగమిచ్చకంబుగాదు
శ్రితదురితదూర కొక్కుతేజీవజీర॥ ౩

సీ॥ పతితాత్మకులు వీరు పతితపావనుఁడ నే నంచు
నించుక మది నెంచుమయ్య
దీనాగ్రణులు వీరు దీనపోషణుఁడ నే
నంచు నించుక మది నెంచుమయ్య
చదువెఱుంగరు వీరు చదువులప్రోడ నే
నంచు నించుక మది నెంచుమయ్య

భాగ్యహీనులు వీరు భాగ్యవంతుండ నే
నంచు నించుక మది నెంచుమయ్య
గీ॥ యెంచి యేకార్యమైనఁ గావించెనేని
మిగుల శోభను వహియించు జగతిగాన
యెంచి కర్తవ్య మిపు డాచరించుమయ్య
శ్రితదురితదూర శోకహృత్తేజీవజీర॥
సీ॥ ఆశ్రితపక్షపాతాభిరాముఁడ వౌట
నైశ్వర్యప్రదుఁడవై యలరుటయును
దీనజనావనస్థిరమానసుఁడ వౌట
తరుణేందు నొసలఁ దాల్చుటయును
కళ్యాణసంఘుసంఘటనాపటుఁడ వౌట
కరుణాంబురాశివై పరఁగుటయును
జాడ్యంగిరియూహ నేఁడుగానఁగనయ్యెఁ
దలిదండ్రిపోలిక మెలఁగవలయు
గీ॥ నంచు నేగద వహ్నారే యవనియందు
బొట్టివానికి బుట్టుబుద్ధు లనెడు
మాట నిజమాయె నోర వామనశరీర
శ్రితదురితదూర శోకహృత్తేజీవజీర॥
సీ॥ హల్లకాంభోజ కల్హారాదు లవియేల
గరికపూజకె యుబ్బఁగనుదు వనుచు

పనస రసాల రంభాఫలాదు లవేల
 నారికేళంబులే గోరుదనుచు
ఘృతమధుశర్కరాన్నృతభక్ష్యము లవేల
 కుడుములకే యాసగొనుదువనుచు
నతులనిష్ఠురతపోవ్రతచయాదు లవేల
 తొలిమొక్కులకె సంతసిలుదు వనుచు
గీ॥ విన ముదమెగాని యాశ్రితజనులచేత
నోర గుంజిళ్ళు దీయింతువనెడుమాట
విన్న నించుక జంకగుచున్నదన్న
శ్రితదురితదూర కొంకతే జీవజీర॥ ౬
సీ॥ అతులితైశ్వర్య మిమ్మని వేఁడరాదటే
 కడుబత్తితో దండ్రిగారితోడ
పాలింపుమని విన్నపము సేయరాదటే
 కడుబత్తితో దల్లిగారితోడ
సిరులనిమ్మని ప్రాని చెప్పంగరాదటే
 కడుబత్తితో మామగారితోడ
దీర్ఘాయువిమ్మని దెలుపంగరాదటే
 కడుబత్తితో బావగారితోడ
గీ॥ మాయెడల నించుక దయాభిమానముంచి
చెలువలర నీవు విజ్ఞప్తి జేసితేని

వాకు నీముద్దు జెలుపరే మేరుధీర
శ్రితదురితదూర కొంకుణతేజీపజీర॥ ౭

సీ॥ భయభక్తియుక్త సద్భక్త విధ్యుక్తోప
చార పూజానమస్కారములకు
లయబ్రహ్మమైన బాలాజిదాసాగ్రణి
హరికథారససుధాఝరులవలన
వర కొమ్మజోశ్యులప్పనశాస్త్రి
రచితాంధ్రగీర్వాణ పద్యసంకీర్తనముల
డమరు మృదంగ డిండిమ ఝల్లరీముఖ్య
హృద్యావనవద్య సద్వాద్యగతుల

గీ॥ నీవు ముదమంద నవరాత్రి లేక విధిని
జరుపుచుండెడి మత్పురజనుల మమ్ము
సాకుమని వేరె విన్నవించంగవలెఁ
శ్రితదురితదూర కొంకుణతేజీసజీర॥ ౮

సీ॥ ప్రతివత్సరంబు తప్పక నీదుసంసేవఁ
జేయునట్టుల కటాక్షింపుమయ్య
పనులందు విఘ్నంబులనుమాట కలనైనఁ
గలుగనీయక దయఁ దలఁచుమయ్య
యాయురైశ్వర్య కీర్త్యాదిసౌభాగ్యముల్
హెచ్చునట్టుల మది నెంచుమయ్య

లోపంబులున్న విలోకింపకనుకంప
పెంపార మదిని క్షమింపుమయ్య

సీ॥ యనుచు నిను వేఁడుటలు విధియనియొ కాని
తెలసి భక్తులకోర్కెలు వలసినటుల
పరఁగ జేయఁగ లేవె సర్వజ్ఞతనయ
శ్రితదురితదూర కోట్యర్కతేజ వీర। ౯

క॥ భువి భక్తి నీగణేశ
స్తవరత్నావళి పఠించు సద్భక్తులకున్
శివతనయాగ్రజుఁ డొసఁగును
నవిరల సంపదల నాయురారోగ్యములన్। ౧౦

సంపూర్ణము.



శ్లో॥ లోకేశే విబుధాః కళంకమనిశం సంత్యజ్య సర్వాః
కళా స్సంగృహ్యాత్మను మోదభారమతులం గచ్ఛం
తి యద్వత్తథా। శ్రీమన్మూషకవాహనస్తుతిలసత్ప
ద్యేషు హృద్యేషు నో దోషాశ్చే ద్విబుధా విసృజ్య
సుగుణా న్గృహ్ణంతు మోదంతు భోః॥

